Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ డిసంబరు నెల 4 వ తేది శుక్రవారం [నె 48 రు.



## ప్రధాని చర్చిల్ కూతురు.

మేరీ చర్చిలు.

బ్రిటిషు ప్రధానమంత్రి చర్చిలుగారి ఆఖరు కూతురు. 18 సం॥ల యువతి. బ్రిటిషు స్త్రీల సైన్యంలోచేరి తన బస సంతోషంగా కుదుచుకొంటున్నది. ఆగ్జి-లరీ టెరిటోరియలు యూనిటులో పైకి వేటుగా నున్నది. ఈ స్త్రీల సైనిక దళంవారు విమాన విధ్వంసక యంత్రాలను నడుపుచున్నారు.





# యుద్ధ విమర్శ.

## హిట్లరు పతన ప్రారంభం—రష్యను తిరుగుదాడి—టునీషియా యుద్ధం.

రష్యనుల తిరుగుదాడి.

రష్యా మధ్యభాగంలో స్టాలిను సేనలు తిరుగు దాడులు ప్రారంభించి హిట్లరు సేనలను రూపుమాపే సంకల్పం సార్థకం చేస్తున్నవి. రష్యాయొక్క ఎఱ్ఱ సేనలు 19 మైళ్లు ముందుకి వెలికిలూకిపురం వరకు వచ్చినవి. ఇది ప్రధాన మయిన రైల్వేకూడలి స్థలం. జెవ్ అను పట్టణమునకు పడమరనైపున శత్రువుల సైనికశ్రేణి మూడుచోట్ల ఛేదించబడెను. ఈ తిరుగుదాడి జయప్రదంగా కొనసాగి మాస్కో-స్మోలెన్స్కు రోడు ప్రాంతాలందు రష్యనుల ఆధిపత్యం స్థాపించగలదనుకోవచ్చును. అది జరిగినచో స్మోలెన్స్కు నగరమే తిరిగి రష్యనుల వశం కావచ్చును. అపుడు మాస్కో నగరాన్ని ఎదిరించుచున్న జర్మను సేనలకే ప్రమాదమేర్పడును.

దక్షిణమున స్టాలినుగ్రాడు ప్రాంతములందు డాను నది వంపునుండి కాకసను పర్వత మధ్య ప్రాంతములవరకు రష్యను సేనలు పురోగమన దాడి ప్రారంభించినవి. స్టాలినుగ్రాడు నగరానికి ఉత్తరాన దక్షిణానగూడ, నల్ల సముద్రతీరాన నొవరోసిస్కు, టువాప్సి, నాల్చిక్, కాల్మకువరకు గూడ తిరుగు దాడులు ప్రారంభించి విజయం బడసినవి. జర్మను సేనలు గత వేసంగిలో గెల్చిన గెలుపు నిలుపుకొనుటకు రష్యనులు అవకాశమివ్వలేదని యీ విజయాలు తెల్పుచున్నవి.

నిరుడు— ఈ యేడు

రష్యా యుద్ధంలో నిరుడు జరిగినట్లే యీ యేడు జరుగుచున్నది. నిరుడీ సమయంలో మాస్కో, లెనిను గ్రాడు నగరాలందు జర్మనులకు చలి త్రోసుకొస్తూవుంటే తలదాచుకోడానికి తావు

లేకుండా రష్యనులు నిరోధించుచుండిరి. ఈ యేడు స్టాలినుగ్రాడు, గ్రాజ్ని, కాకేషియాలందు జర్మనులు శీతకాలం మకాం లేకుండా తరిమివేయబడిరి. రష్యా యుద్ధ పరిస్థితులు నిరిటి నవంబరులో వలెనే యీ నవంబరులోగూడ ఉన్నాయి. 1941 వ సం॥ నవంబరు 22 వ తేదీన జర్మనులు లెనినుగ్రాడు నగరం చేరువకువచ్చి, టికివినుపురం తీసుకొని, మాస్కో ముఖ్యనగరాన్ని మూడు వైపుల చుట్టవేసిరి. మధ్య రష్యాలో యెలెట్జి దాటివచ్చిరి, యుక్రయిను, క్రిమియాలు తీసుకొని రోస్టావు నగరం ప్రవేశించియుండిరి. ఈ యేడు అదే తేదీకి జర్మనులు స్టాలినుగ్రాడువద్ద పీఠంవేసుకొని డానునది దాటి కాకేసియా రాష్ట్రం మధ్య, ఉత్తర భాగాలకు వచ్చి, నొవరోసిస్కు, టువాప్సి, గ్రాజ్ని నగరాలను బెదిరించుచున్నారు. నిరుడు రష్యనులు అన్ని యుద్ధరంగాలలో రక్షణ యేర్పాటులందే యుండిరి. చలికాలం వచ్చుటయు, బ్రిటిషు సేనాని అకినులేకు బెంగాజి నగరం (ఆఫ్రికాలో) వరకు ఆక్రమించుటయు, రష్యనులకు నిరుడు సహాయకారిగా నుండెను. అందువలన రష్యాలోనుండిన జర్మను విమానదళం కొంత ఆఫ్రికాకు మరలెను. ఈ ఏడుకూడా చలికాలం ముందుగ వచ్చింది; ఆఫ్రికాలోను ఈజిప్టులోను మిత్ర సేనల దాడులు రష్యానుండి జర్మను విమానాలను మరల్చెను. అందుచే రష్యనులు అనేక తావులందు తిరుగు దాడులు చేయగల్గిరి.

**హిట్లరు స్థితి అధ్వాన్నం.**

హిట్లరునకు సంబంధించినంతవరకు యిపుడు స్థితి నిరిటికన్న అధ్వాన్నమయిందన వచ్చును. నిరుడు రష్యా రంగంలో మంచుపడే సరికి హిట్లరు శీతకాలం మకాం హద్దులు నిర్ణయించుకో గల్గియుండెను. యుద్ధం నిలిపి కొంత మంది సైనికులను జర్మనీకి పంపి మందుగుండు కర్మాగారాలలో పనిచేయించి తిరిగి వేసంగిదాడికి తయారయ్యెను. అప్పుడు జర్మనీకి పడమరను మిత్రరాజ్యాల దాడి భయంలేకుండెను. పైగా హిట్లరు తన తోడి దొంగయగు జపానుచే పశిఫిక్కులో (డిశంబరు 7) మిత్రరాజ్యాలపై దాడి చేయించగల్గెను. కాని యీ యేడు హిట్లరు సేనలకు అటువంటి విశ్రాంతియుండదు. ఉత్తరాఫ్రికాలోను, రష్యాలోను, దక్షిణ పశిఫికులందు మిత్రరాజ్యాలు అద్భుతంగా విజయం పొందినవి. ఆఫ్రికాలో, యూరోపులో, ఏషియాలోగూడ అక్షరాజ్యాల పురోగమనదాడి నిలచి రక్షించుకోవలసిన స్థితి ఏర్పడింది.

**అన్ని వైపులా శత్రువులే.**

1941 వ సం॥ చలికాలంలో హిట్లరు యుద్ధమాపి తన సేనను వృద్ధిచేసుకొనుటకు విశ్రాంతి దొరికెను. 1942 వ సంవత్సరము చలికాలంలో అతని సేనలు యిదివరకు కన్న తగ్గునేగాని ఎక్కువ కాలేవు. జర్మనులు రష్యా యుద్ధంలో చాల సైన్యాన్ని సరకును నష్టపోయేరు. నిరిటికన్న యీ యేడు రక్షించుకోవలసిన తావులు ఎక్కువయు కడుదీర్ఘమును అయినవి. హిట్లరు సబుమెరైనులు ఆర్కిటికు, అట్లాంటికు సముద్రాలేకాక, యిపుడు మధ్యధరా సముద్రం కూడా కాపలాకాయాలి. రష్యనులు త్రోసుకోరాకుండా తూర్పున, బ్రిటిషువారు త్రోసుకోరాకుండా పడమరను, ఆఫ్రికానుండి మిత్రమండలి సేనలు ఇటలీని మింగేకుండా దక్షిణాన్న హిట్లరు "సైనిక గోడలు" కట్టాలి.

**హిట్లరు అంతం మొదలు.**

తన అంతం మొదలగుచున్నదని హిట్లరు గుర్తించి యుండును. ఇపుడున్నది ఉంచుకొనుటకు తంటాలు పడాలని నవంబరు 8 వ తేదీన హిట్లరన్నాడు. రష్యా సేనల కర్తవ్యమేమంటే నిరుడు మాస్కోను రక్షించుకొన్నట్లే, యిపుడు స్టాలినుగ్రాడునకు ఉత్తరాన్న దక్షిణాన్న ఉన్న శత్రుసేనలను తరిమేయాలి. స్టాలిను నగరానికి వాయువ్యంగానున్న కలాచ్ పురమును రష్యనులు అపుడే పట్టుకొని యీ పని ప్రారంభించేరు. దక్షిణాన్న క్రాసనోర్నిస్కు వైపు తిరుగుదాడి ప్రారంభించేరు, డాను నది తూర్పు ఒడ్డున వున్న జర్మను సేనలకు సప్లయిలు అందజేయు రైలు మార్గాన్ని రష్యనులు కోసివేసిరి. దక్షిణాన్న గ్రాజ్నిపురంవద్దనున్న చమురుగనులను తీసుకోవాలని హిట్లరు ప్రయత్నిస్తున్నాడు. ఆర్జొనోకిడ్జివద్ద రష్యనులు గొప్పవిజయం పొందుటచే గ్రాజ్నిపై జర్మనుల ఒత్తిడి తగ్గినది. మొత్తంపై చూస్తే, లెనినుగ్రాడు, మాస్కో నగరాలను, కాకసను ప్రాంతాన్ని ఆక్రమించాలనే హిట్లరు ఆశలు యిదివరకు కన్న చాలదూరమయినాయి. ఈ చలికాలంలోగాని, రానున్న వసంతంలోగాని హిట్లరు రష్యానుండి సేనలను పూర్తిగ మరలించినా ఆశ్చర్యంవుండదు.

[తరువాయి 6 వ పేజిలో]

# యుద్ధం త్వరలో ముగియకున్నా - - -
# - - యూరోపులో ముందు ముగియును.

## చర్చిల్ ప్రధాని యుద్ధ సమీక్ష.

## నిరోధాలన్ని దాటి విజయం పొందగలం.

## రష్యా విజయాల ప్రశంస : ఇటలీకి హెచ్చరిక.

" యుద్ధం త్వరలో ముగిసే సూచనలు లేవు గాని ముందుగ యూరోపులో యుద్ధం ముగిసి పసిఫికు సముద్రంలో యింకను కొనసాగుచుండ గలదు. అపుడు ఆస్ట్రేలియా, న్యూజిలండు, అమెరికాలకు బ్రిటిషు సేన అంతాపోయి సహాయం చేయగలదు. ఉత్తరాఫ్రికా అంతా మిత్ర మండలి వశమయినాక ఇటలీలో విమానాశ్రయములు నౌకాశ్రయములు, సైనిక శిబిరాలు, మందు గుండు కర్మాగారాలన్ని బ్రిటిషు విమానదాడులచే ధ్వంసం చేయబడగలవు. "

అని బ్రిటిషు ప్రధానామంత్రి చర్చిలుగారు నవంబరు 30 వ తేదీన రేడియోద్వారా ఉపన్యసించిరి. ఇది బ్రిటిషు రేడియో కేంద్రంనుండి 24 భాషలలో ఒక్క రోజులోగా ప్రపంచంలో అన్ని మూలలకు పంపబడెను.

చర్చిలుగారి మాటలు కొన్ని యీ దిగువ గలవు :—

రెండు వారాల క్రిందట ఈజిప్టులో అలామీను వద్ద విజయం పొందినందుకు సంతోషంగా చర్చీలలో గంటలు వాయించితిమి. ఇదివరకు మన లోపములవల్ల ఎన్ని ఇబ్బందులకు లోనయిన ఉత్తరాఫ్రికా విజయములతో మనము గట్టెక్కితిమని చెప్పవచ్చును. కష్టాలన్ని తీరలేదు. కాని గడచిన మూడేండ్లలో జరిగినది తలచుకుంటే, మనలను రూపుమాపేసేగల కష్టాలు దాటిపోయేమనీ, మానవకోటి అంతటి స్వాతంత్ర్య కాపాడుటకు మనము జీవించియుందుమనీ నమ్మవచ్చును. భూగోళమంతటిపై విస్తరించియున్న వివిధ జాతులు దేశాల సంఘమగు బ్రిటీషు సామ్రాజ్యము—మీరు కావలిస్తే బ్రిటిషు కామను వెల్తు అనుకోండి, నా కభ్యంతరము లేదు—యీ సామ్రాజ్యమును, ముఖ్యంగా యీ బ్రిటిషు దీవి అన్నివైపుల నిరాశ యనే చీకటి ఆవరించినపుడు ఒంటరిగ నిలచియుండి, సంయుక్తరాజ్యాలన్నింటిపై కాంతి వెదజల్లగల జ్యోతిని ఆరిపోకుండ నిలిపి యుంచగల్గినది.

ఈ రెండు వారాలలో మన ధర్మకార్యము మరింత ముందుకి పోయినది. 8 వ సైన్యము రోమెలు సేనలను తరుముకొనుచు 400 మైళ్ల ముందుకు పోయినది. ట్రిపోలిటానావద్ద పెద్ద యుద్ధము యింకను జరుగగలదు. ఉత్తరాఫ్రికాలో కడువిశాలమయిన ప్రదేశము. అందు దినమునకు 20, 30, 40 లేక 50 మైళ్ల చొప్పున విరామంలేకుండా మన సేనలు సాగిపోతున్నాయి.

### ఎత్తుకి రెండెతులు లాభం

అటు పడమటను 1,000 మైళ్ల దూరంలో అమెరికా-ఇంగ్లాండులు కలసి అనేక జలాంతర్గాముల వలయముల దాటి అనేక లక్షల సేనలను పలుతావులందు ఒకేసారి దింపగల్గినవి. అవి నావలమీద దూరస్థలములనుండి వచ్చి మొరోకో ఆల్జిరియాలందు చేరినవి. ఈ రవానా సమయమున అనేక నావలు శత్రువుల కాకర్షణీయంగా బాహాటంగా నుండెను. శత్రువిమానాలను, జలాంతర్గాములను మన యుద్ధనావలు విమానాలు ఓడించినవి. ఇది అద్భుత కృత్యమనక తప్పదు. మనదొక స్టీమరుపోతే దానికి బదులు శత్రువుల జలాంతార్గామి ఒకటి మునుగుటో చెడుటో జరిగెను. మనకు నష్టమయిన నావలకు రెండింతల నావలు ఫ్రెంచి ఉత్తరాఫ్రికా రేవులందు వశపరచుకొంటిమి. ఈ ప్రాంతమున నేల సైన్యాలన్నింటికి అమెరికను సేనా నాయకుడు ఎషనుహోవరుగారు ప్రధాన నాయకుడుగనున్నాడు. నౌకాదళమంతకు బ్రిటిషు అడ్మిరలు కనింగుహాంగారు నాయకుడుగానున్నారు. బ్రిటిషు, అమెరి

కను సేనలన్నింటికి పరిపూర్ణమగు ఐకమత్యము సామరశ్యముగలదు.

### ఆఫ్రికానుండి దూకుకుట.

“ ఫ్రెంచి ఉత్తరాఫ్రికాలో సేనల దింపిన సమయాన్నే జనరలు అలగ్జాండరుగారు అలామీను యుద్ధం ప్రారంభించి రెండుచోట్ల విజయాలు మిత్రదేశాలు తమతాటస్థ్యం విడవకుండ ప్రోత్సాహం కలుగునట్లు చేసిరి. ఇంకను ఆఫ్రికాలో వశంకాక మిగిలియున్న టూనిసియాలోను జర్మను ఇటలీ సేనలను యీ సమయమున బ్రిటిషు ప్రధమసైన్యం తుక్కురేగగొట్టుచున్నది. జర్మనీకి వశమయిన యూరోపు ఖండమునకు అడుగున 2,000 మైళ్ల పొడవున విస్తరించియున్న ఆఫ్రికా సముద్రతీరమంతా మావశం కాగలదు. ఈ ప్రాంతంనుండి త్వరలో శత్రువులను పూర్తిగ తరిమివేయుదుము.

“ కాని ఆఫ్రికాలో నిలచిపోము. అది మాకు స్థావరంకాదు. అటనుండి యూరోపు మీదికి దూకుటకు ఊతబల్లగా ఆఫ్రికా ఉపయోగించును. ఈ తీరమంతా వశమగుటవలన సప్లయి నౌకలు ఆఫ్రికాచుట్టి రావలసిన అవసరముండదు. శత్రువుపై యింకోవైపునుండి విమానదాడి ప్రారంభించగలం. జర్మనుల విమానశక్తి తగ్గిపోవుచున్నది. నష్టాన్ని పూడ్చుటకు తగిన విమానాల ఉత్పత్తి వారు చేయలేకుండా యున్నారు. వారి సంగతి అట్లుండ బ్రిటిషు-అమెరికను-రష్యను విమానదళం యిప్పుడే వారిని మించియున్నది, యింకను పెరుగుచున్నది.

### ఇటలీకి హెచ్చరిక.

“ దురదృష్టవంతులగు ఇటలీ ప్రజలను ముసోలిని మోసగించి యుద్ధంలోదింపి అవమానపరిచాడు. ఆ ఫాసిస్టు ఇటలీపై విమానదాడి తీవ్రముగ యికముందు ఆఫ్రికా తీరంనుండి జరిపెదము. అపుడే ఇటలీలోని ఉత్తరభాగెపు పరిశ్రామిక నగరాలు, ఇంగ్లాండులో ఏనగరం ఎరుగనంత తీవ్రమగు విమానదాడికి లోనగుతున్నాయి. టునిషియాగూడ పశమయినచో దక్షిణ ఇటలీలోని నౌకాకేంద్రాలు, మందుగుండు కర్మాగారాలు, సైనిక శిబిరాలు అన్నియు రూపుమాసిపోవునట్లు దాడి చేయగలము. ఇటలీ ప్రజలపుడు యీ యుద్ధం ఎందుకువచ్చిందిరాయని ఏడ్వగలరు. 400 లక్షలమంది ఇటలీవారు యుద్ధం కోరలేదు. ఒకడే యీ యుద్ధం వారికి తెచ్చిపెట్టెను. వారంతా శాంతిసౌఖ్యాలు పొందాలనే తటస్థంగానుండాలనే ఎంతోప్రయత్నం చేసితిమి. కాని ఫ్రాంసు పడిపోయినాక, ఇంగ్లాండుకూడ నిస్సహాయయని ఎంచిన ముసోలిని వెనుకనుండి పోటుపొడిచెను. నా సలహాయు, అమెరికను అధ్యక్షుని సలహాను ముసోలిని పెడచెవిని పెట్టెను. నేడు ఇటలీ తన సామ్రాజ్యమంతా గోల్పోయెను. ఇది యింకా ఇటలీ దురవస్థ ప్రారంభమే. మాతో సఖ్యత చేసుకోకపోతే యింకా కష్టాల పాలగును.

### రష్యా విజయ ప్రశంస.

“ నేను ఆగస్టులో రష్యాకు పోయినపుడు ఈజిప్టులో రోమెలుని పూర్తిగ ఓడించగానే నేను తంతి నిత్తునని రష్యా ప్రధానియగు స్టాలినుకి చెప్పియుంటిని. అతను మ్యాపు చూపి, ఒక బాణం గుర్తువేసి యీ ప్రాంతంలో తాను తిరుగుదాడి ప్రారంభించగానే తంతివార్త పంపుదుననెను. మా యిద్దరికి యీ తంతులు చేరినవి. ఇపుడు స్టాలినుగ్రాడు తీవ్రయుద్ధం ముగింపుకి రానున్నది. తెల్ల సముద్రంనుండి నల్ల సముద్రం వరకునున్న విశాలభాగంలో యిదొక్క ఘట్టమే. రష్యను చలి అపుడే జర్మను సైనికుల ఎముకలు కొరుకుచున్నది. రష్యాలోనుండిన జర్మనుల 180 డివిజనుల సేనయు అతివడిగా క్షీణించి బ్రిగేడులుగ మారింది. జర్మను సైనికులు రెండోసారి చలికి చస్తూ, తాము సేనానాయకుని స్వాధీనంలోకాక సైనికుడగు కార్పొరలు హిట్లరు నాయకత్వంలో నున్నామని గుర్తించగలరు.

### ఫ్రాంసులో మార్పు.

మొరోకో, ఆల్జిరియాలను మేము ఆక్రమించగనే ఫ్రాన్సును జర్మనీ పూర్తిగ ఆక్రమించునని ముందే అనుకొన్నాను. అట్లాగే జరిగింది, అదీ మంచిదే, విషీ బూటక ప్రభుత్వం అంతమొందెను. ఇక ఫ్రెంచి ప్రజలందరు ఏకమై జర్మనీకి ఎదురు తిరిగెదరు. ఫ్రాంసు స్వాతంత్ర్యమునకు ఫ్రెంచివారి ఐకమత్యము ముఖ్యతమము. టులోనులోని ఫ్రెంచి యుద్ధ నౌకలు ముందే మాతో చేరియుండిన బాగుండెడిది. కాని జర్మనుల చేతిలో పడకుండ తమంత నవియే ప్రేల్చుకొని ధ్వంసమగుటయు కొంతమేలే.

[తరువాయి 5 వ పేజీలో]

# భారతీయ నావికుల ప్రతిభ

క్రొత్త యుద్ధనౌక వేరొక కుంటి నౌకను 500 మైళ్లు యీడ్చుట.

భారతీయ నౌకదళమునకు (రాయలు ఇండి యను నేవీ) చెందిన నావికులు ఇంగ్లాండులో కట్టిన కొన్ని క్రొత్త యుద్ధనౌకలను ఇండియాకు తెచ్చిరి. త్రోవలో వారు శత్రువుల నీటమునిగే సబు మెరైనులతో విమానాలతో చాల యుద్ధాలుచేసిరి. వర్తక నౌకలకు కాపలాగానుండి వారు శత్రు సబుమెరైనులనేకం ముంచిరి.

ఇండియాకు వచ్చిన క్రొత్త యుద్ధనౌకలలో నొకటి, దెబ్బతిన్న వేరొక నౌకను 500 మైళ్ల వరకు నీటిలో యీడ్చుకొనివచ్చెను. ఇంకొక స్టీమరులోని నావికులు నీటిలో కొట్టుకొనుచు కన బడగా వార్ని రక్షించెను.

యుద్ధనౌకల కాపలాతో వర్తకనౌకలు వచ్చి నపుడు వాటికట్టే నష్టము జరుగలేదు. కొంత నష్టం ఉండకపోదు కాని నౌకలని ముంచుటకు ప్రయత్నించిన శత్రువుల సబుమెరైనులనుగూడ పెక్కింటిని యివి ముంచినవి.

పైనపేర్కొనిన భారతీయ యుద్ధనౌక ఒకసారి 40 నౌకలు గల జట్టులో కాపలా నౌకగ నుండెను.

ఈ నౌకలందు పనిచేసిన నావికులును ఉద్యో గులును, ఇండియా చుట్టునున్న సముద్ర మార్గా లు కాపాడుటకు ఆదుర్దపడుచున్నారు. వారి కిపుడు తగిన సమర్ధతగల నౌకలుగూడ కలవు.

ఈ క్రొత్త నౌకలు అతివడిగా పోగలవు. అన్ని రకముల ఆయుధాలు గలవు. ఎటువంటి విమానాలు జలాంతర్గాములు వచ్చినా చావగొట్ట గలవు. మందు గనులనుగూడ తొలగించే సాధనలు వాటిలో గలవు.

---

[4 వ పేజీ తరవాయి]

ఆయితే

జర్మనీ పిడికిటిలో యీపత్తు యూరోపుఖండం వున్నది. యూరోపులో జయించిన దేశాలలో ఎవరికి తిండిలేకున్నా జర్మనులకు తిండి లేక పోదని జర్మను మంత్రి గోరింగు అన్నాడు. కావున జర్మనీకి తిండిలేకుండ మాడ్చుట కష్టమే. జర్మను సైన్యంలో కొంచెంభాగమే యిప్పటికి యుద్ధంలో దిగింది. జర్మను జలాంతర్గాముల ఉపద్రవం తగ్గుటకు బదులు హెచ్చగలదు. అం దుచే యుద్ధం త్వరగా ముగుస్తుందనుకోరాదు. మన కృషి తగ్గించరాదు, మన ఐకమత్యం సడ లించరాదు. కష్టాలు తగ్గేయనికాని త్వరలో ముగుస్థాయనికాని అనుకోరాదు. విజయం రాకముందే ఆ విజయాన్నెట్లు వినియోగించాలని తగవు లాడుకోరాదు. మంచి చెడ్డలు రెండు ఎదుర్కొని యింతవరకు చేకూరిన విజయాలను యింకను యెక్కువ విజయాలు సంపాదించుటకు ప్రోత్సాహంగా నెంచుకోవలెను. ఏషియాలో యుద్ధంకన్న యూరోపులో యుద్ధం ముందు ముగియగలదు. భావిస్థితినిగూర్చి నే చెప్పగలి గిందింతే. అది తప్పుగా వచ్చును.

యుద్ధానంతర సమస్యలు.

పసిఫికు సముద్రంలో యుద్ధం తుపాను యింకను చెలరేగుచుండ అట్లాంటికు సముద్రం శాంతించినచో, మా సైన్యాలన్నింటిని ఆవలి వైపునకు పంపి అమెరికా - చీనాలకు అంతకన్న ఎక్కువగ మా బంధువర్గమగు ఆస్ట్రేలియను, న్యూజిలండు ప్రజలకు, జపానుకి ప్రతికూలంగా తోడ్పడ పంపెదము. తూర్పు దేశాలలో యుద్ధం జరుగుచుండగ, యూరోపులో స్వాతంత్ర్య జీవ నం తిరిగి సృష్టించుటకు, తిరిగి నాగరికతకు వినాశకరమగు తగవులు రాకుండుటకు అమెరికా-రష్యాలతోను, అందుకు సంబంధించిన యితర సంయుక్త రాజ్యాలతోను చర్చించుచుందుము.

యుద్ధం రెండు దఫాలుగా ముగిస్తే, సమాలో చన సమయములందు గెలిచినవారి మధ్య ఎక్కువ స్నేహభావం ఉండగలదని నా యూహ. ఒకే సారి విజయం పూర్తిగ చేకూరినచో ప్రమాదం తొలగిపోయి, గెలిచిన మిత్రమండలి దేశాలకు ఐకమత్యపులంకె తెగి, సమాన బాధ్యత గుర్తింప జాలరు. అట్లుగాక ఒక - ప్రాంతంలో కలిసి విజయంపొంది, యింకో ప్రాంతంలో యింకను కలసి పోరాడుచున్న విజయులకు ఎక్కువ సఖ్యత యుండగలదు. కావున పాతికేండ్ల క్రిందట గత యుద్ధానంతరంలోకన్న యీ యుద్ధానం తరం ఎక్కువ స్థిరంగా నుండగల నిర్ణయములను చేయగలమని ఆశిస్తున్నాను. 1943 వ సం॥పు అరుణోదయం త్వరలో మనల నెదుర్కొనును. తరువాత ఆయేడు యింక ఎంత ఎక్కువ గాడ్పు లకులోను కావలసియుండునో! దానిని దృఢ విశ్వా సముతో అధిక బలంతో గట్టి గుండెతో ఎదు ర్కొందము " అని చర్చిలుగారు నుడివిరి.

[2 వ పేజీ తరువాయి]

యూరోపు ఆఫ్రికాలకు మధ్యనున్న సముద్రాధిపత్యమునకై యిపుడు ఘోరయుద్ధం అక్ష

టునిషియా యుద్ధం.

రాజ్యాలకు మిత్ర రాజ్యాలకు జరుగనున్నది. చర్చిల్ దెలిపినట్లు యూరోపంతా హిట్లరు వశమయింది. దానికి దిగువ 2,000 మైళ్ల పొడవు ఆఫ్రికా సముద్రతీరమును మిత్రసేనలు ఆక్రమించినవి. కాని అందు టునిషియా ద్వీపకల్పంమాత్రం యింకా వశంకాలేదు. దానివద్ద నుండి ఉత్తరమున సార్డినియా సిసిలీ దీవుల మధ్యనున్న సముద్రాధిపత్యం మధ్యధరా సముద్రాధిపత్యమంతకు ముఖ్యమయినది. ఇది జర్మనీ వశమయితే యూరోపు రక్షణకు ఎంతయో సహాయకారిగా నుండును. అది మిత్రమండలి పడమరకు నైరుతివైపునకు జర్మను సేనలు దాడి వెడలి, ఆల్జీరియానుండి మిత్రసేనలు టునిసియా లోనికి ప్రవేశించకుండా ఆటంకం చేసినవి ; అయినను, శత్రువుల నిరోధం యెక్కువగనున్నను మిత్రసేనలు టునీషియాలో ప్రవేశించినవి. బిజార్టాకు కొద్దిమైళ్ల దూరంలో ఉభయ సేనలకు యుద్ధం జరుగుచున్నది. టునిసు బిజార్టా రైలు మార్గమునందు టూనిసుకి 38 మైళ్ల బిజార్టాకు 24 మైళ్ల దూరంలోనున్న రైల్వేకూడలిస్థలమగు మటూరుపై మిత్రమండలి విమాన పారాషూటు సైనికులు విమానాలలో దిగి దాడిచేసిరి. ఇంకను దక్షిణమునందు ఫెరియానా - గైసా రైలుమార్గమునందు శిబిరాలనుండి వచ్చి మిత్రసేనలు తూర్పునకు త్రోసుకొని వస్తున్నవి. ఈ దాడివలన జర్మను సేనలు మధ్యకు చీలి రెండుగ

# అంటువ్యాధిని వ్యాపింప జేయుచున్నావా ?

దేశంలో ఒక భయంకరమైన జబ్బు వున్నది.
అది మానవుని మనస్సును చెడగొట్టి అధైర్యవంతునిగా చేస్తుంది!

ఆ జబ్బే 'పుకారు.' అందరికి శత్రువైన జపానే దానిని పుట్టించుచున్నది.
మీ స్నేహితులకు సోకునట్లుగా అట్టిదానిని వ్యాపింపజేయకుడు.

## * పుకారులను నష్టకండి *



జపానును ఎదుర్కొనుటకు దేశీయ యుద్ధ రంగమును తయారుచేయండి.

చేజిక్కితే, ఫ్రాంసుపైగాని ఇటలీపైగానీ రెండింటిపైగాని దాడిచేయుటకు ఊతబల్లగ నుండగలదు. అందుకే ఉత్తరాఫ్రికాలో మిత్రసేనలు చేరగనే, జర్మనులు విమానాలపై సైన్యాలను టునీషియాలో దింపిరి. టునీషియా అంతా ప్రక్కనున్న ట్రిపోలిటానావరకు ఆక్రమింపదలచిరి. అక్కడ విమానాశ్రయాలు స్థాపించుకొని మధ్యధరా సముద్రములో మధ్య భాగంపై తాము అధికారం వహించి ఉత్తరాఫ్రికా తూర్పు-పడమర భాగాలందున్న మిత్రరాజ్య సేనలకు టాకా లేకుండా అడ్డుటకు జర్మనులు ప్రయత్నిస్తున్నారు. అంతేకాక లిబియా రాష్ట్రంలోనికి మిత్ర సేనలు పడమర దొడ్డిదారినుండి రాకుండా కాపాడదలచిరి. అందుకని బిజార్టా, టూనిసు రేవు స్థలములనుండి విభజింపబడగలవు. అట్టి ప్రమాదం లేకుండుటకై జర్మను సేనలు టునీషియా దక్షిణంనుండియు మధ్యభాగంనుండియు ఉత్తరంగా పోవుటకు వుత్తరువు చేయబడినవి. జర్మనులు ట్యూనిసు నగరం ప్రాంతంలోను బిజార్టాకు 30 మైళ్ల నైరుతి దిక్కున స్థావర మేర్పరచుకొని పట్టుదలతో రక్షించుకొనుచున్నారు. వారి విమానదళంకూడ స్థిరమయిన యేర్పాటులు టునీషియాలో చేసుకొన్నది. అటునుండి శత్రువుని పూర్తిగ తరిమివేయడానికి ఘోరయుద్ధం జరుగుతుంది. మిత్రసేనల దాడి నిరోధించడానికి జర్మనులు విమానదాడులు జరిపిరి కాని లాభంలేకపోయెను. మిత్రసేనలకు సరకు సప్లయిలు మూలస్థానముల నుండి విమానాలపై పంపబడుచున్నవి.



ఆఫ్రికా ఎడారులలో శత్రువులకు సప్లయిలు గొంపోవుచున్న రైలుపై బ్రిటిషు విమానములు బాంబులువేసి కాల్చినవి. పేలినపిదప పొగయున్న రైలుబండి యింకోవిమానం చక్రంలోనుండి కనబడుతున్న దృశ్యం.

# తులాను సంక్రమణం.

సామాన్యంగా మనవాళ్లందరూ గొప్పగా పండుగ చేసికొని కొత్త బట్టలు కట్టుకొనడం మకర సంక్రాంతి పండుగనాడే. దానినే సామాన్యంగా సంక్రాంతి పండుగ అంటారు. ఆ పండుగకే కోడి పందెములు గ్రామాలలో జరుగతూ వుంటాయి. ఆ పండుగకే తెనుగు దేశంలో ఆడపిల్లలందరూ బొమ్మల కొలువుపెట్టి, గొబ్బెమ్మలనుపెట్టి పళ్లు పంచిపెట్టుకుంటారు. ఆ పండుగకే ఇంట్లో పెద్దవాళ్లు గుమ్మడిపళ్లు దానమిస్తారు. వాకిళ్లలో సంక్రాంతి ముగ్గులు శృంగారంగా పెడ్తారు. విష్ణు ఆలయములోని దేవుణ్ని వీధులలో ఊరేగిస్తారు. మన తెనుగుదేశానికి అసలైన పెద్ద పండుగ అది. అప్పటికి కొత్త పంటధాన్యం ప్రతి రైతుకూ ఇంటికి చేరి వుంటుంది. ధనధాన్య సమృద్ధిగా రైతులు వుంటారు. అప్పటికి గేదెలు యీనెడి రోజులు. ఇంట్లో పశువులపాడి కూడా వుంటుంది. పశువులకు మేతకూడా పుష్కలంగా ఉంటుంది. చెరువులలో, కాలువల్లో, నదుల్లో నీళ్లు సమృద్ధిగా వుంటాయి. కాయగూరలు, పళ్లు, పుష్పాలు తామరతంపరగా బజారునిండా వుంటాయి. అందుచేత మకరరాశిలోకి సూర్యుడు ప్రవేశించినప్పుడు ఆ మకర సంక్రమణాన్ని చాలా పర్వదినంగా ఆంధ్రదేశమంతటా జరుపుతూ వుంటారు.

కాని, సూర్యుడు మకరరాశిలోకి ప్రవేశించినట్లుగానే ఇతర రాసులలోనికికూడా ప్రవేశిస్తూ వుంటాడు. మొత్తం రాసులు పండ్రెండు-మేషం, వృషభం, మిధునం, కర్కాటకం, సింహం, కన్యా, తులా, వృశ్చిక, ధనుస్సు, మకరం, కుంభం, మీనం.—మీనం కాగానే తిరిగి మేషం మళ్లీ, ప్రారంభమవుతూ యీ మీనమేషాల రాశిచక్రంలో సూర్యుడు తిరుగుతూ, ఒక్కొక్క రాశిలోకి ప్రవేశించినప్పుడు ఒక్కొక్క మాసం ప్రారంభమవుతూ వుంటుంది. క్రమక్రమంగా 12 రాసులలో ప్రవేశించడంవల్ల మనకు 12 మాసాలు ఏర్పడ్డాయి. ఇప్పుడు సూర్యుడు వృశ్చికరాసిలో వున్నాడు. దీనికి పూర్వం తులా రాసిలో వున్నాడు. వృశ్చిక రాశిలోనుంచి ధనుస్సులోకి

## మంచి మరమ్మత్తు.

"బోయిసు" అను అమెరికను లైటు క్రూయిజరు యుద్ధనౌక నైరుతి పసిఫికు సముద్రమునందు గొప్పగ యుద్ధం చేసిందని పత్రికలలో వార్తలుగలవు. ఈ బోయిసు నౌకకు గత మార్చి మాసమునందు బొంబాయి రేవులో భారతీయ పనివారే మరమ్మత్తులు చేసిరి.

సాలమన్సు దీవులందు యీ నౌక యుద్ధం చేసిన విధం చూస్తే భారతీయ పనివారు అసమాన్యమగు నేర్పుగలవారని ఎంచవచ్చును.

మారుతాడు. అప్పుడు మనకు ధనుర్మాసం జరుగుతూవుంటుంది ధనుర్మాసంలోనే ప్రతిరోజూ ప్రాతఃకాలం గొబ్బెమ్మలు పెట్టడం, తెల్లవారు జామున భజనలు చెయ్యడం జరుగుతూవుంటుంది. కనుక, మన పంచాంగపు లెక్క ప్రకారంగా తులా రాశిలో సూర్యుడు ప్రవేశించడం క్రిందటి నెల అయిపోయింది. ఒక్కొక్క రాశిలో సూర్యుడు ప్రవేశించిన దినం ఆ రాశికి సంబంధించిన సంక్రమణ దినం అంటారు. కనుక తులా సంక్రమణం సుమారు రెండు నెలల క్రిందనే అయిపోయింది. దానితర్వాత వృశ్చిక సంక్రమణం కూడా అయిపోయింది. డిశంబరు నెల 15 వ తేదీకి ధనుస్సంక్రాంతి రాబోతున్నది.

### యుద్ధ పంచాంగం

అయితే సుమారు రెండు మాసాలక్రింద దుర్గాష్టమినాడు అక్టోబరు నెల 17 వ తేదినాడు వెళ్లిపోయిన తులా సంక్రమణం సంగతి యిప్పుడెందుకు చెప్పవలసి వచ్చిందంటే, యీ మధ్య అనగా క్రిందటివారం యుద్ధ పంచాంగంలో కాలచక్రం అడ్డం తిరిగింది. అక్షరాజ్యాల దురాక్రమణ పంచాంగం తారుమారైంది. క్రిందటి వారం అనగా నవంబరు నెల 27 వ తేది శుక్రవారంనాడు తెల్లవారుజామున తులానులో జర్మను సేనలూ, ఇటలీసేనలూ ప్రవేశించి ఆక్రమించాయి. ఫ్రాన్సుతో హిట్లరు 1940 వ సం॥లో యుద్ధం చేసి, ఫ్రాన్సులో కొంతభాగం మాత్రమే ఆక్రమించి, కొంతభాగం మార్షలు పెటేనుగారి ప్రభుత్వంక్రింద స్వతంత్ర ఫ్రెంచి రాజ్యంగానే విడిచిపెట్టినాడు. అప్పుడు ఫ్రాన్సుతో యుద్ధం విరమించినప్పుడు యుద్ధ విరామపత్రంలో వ్రాసికొన్న ఒక ముఖ్యమైన పెద్ద ఖరారు షరతు ఏమిటంటే ఫ్రెంచివారికి ఉన్నటువంటి యుద్ధ నావలను హిట్లరు వశపరచుకొనకుండా ఉండాలి. ఆ షరతుకు హిట్లరు ఒప్పుకొని ఒడంబడిక పత్రం ప్రమాణపూర్తిగా భగవంతుని సాక్షిగా వ్రాసియిచ్చాడు. ఫ్రాన్సుకుగల పెద్ద యుద్ధనావలున్నూ, క్రూయిజరు నావలున్నూ, డెస్ట్రాయరు నావలున్నూ, జలాంతర్గాములున్నూ యితర అనుబంధ నావలున్నూ తులాను రేవులో వున్నాయి. ఫ్రాన్సుయొక్క తూర్పు కోస్తా అనగా మధ్యధరా సముద్రపు కోస్తాలో తులాను రేవు వుంది. ఫ్రాన్సుయొక్క పడమటి కోస్తా అనగా ఇంగ్లాండుకు ఎదురుగావున్న కోస్తా (అట్లాంటిక్కు సముద్రమునకు చెందిన కోస్తా) యావత్తూ ఫ్రాన్సుతో యుద్ధం పూర్తికాగానే హిట్లరు వశపరచుకొన్నాడు. ఆ పడమటి కోస్తా యావత్తు ఇంగ్లాండుకు ఎదురుగా అందుబాటులో వున్నది. కాబట్టి, ఇంగ్లాండు తనకు శత్రురాజ్యం కాబట్టి, ఆ పడమటి ఫ్రెంచి కోస్తా తనవశంలో వుండవలెననే షరతు హిట్లరు నిర్ణయించాడు. తూర్పు ఫ్రెంచి కోస్తా అనగా మధ్యధరా సముద్రానికి సంబంధించిన ఫ్రెంచి కోస్తా తనకు అక్కరలేదన్నాడు. ఆ కోస్తావైపున తనకు బాధ కలుగజేసే శత్రువులుగాని, శత్రు రాజ్యాలుగాని లేవు గనుక ఆ కోస్తా రేవులన్నీ స్వతంత్ర ఫ్రెంచి ప్రభుత్వముయొక్క అధికారంక్రిందనే అనగా పెటేను ప్రభుత్వాధికారం క్రిందనే వుండవచ్చునని హిట్లరు ఒప్పుకొన్నాడు. ఈ తూర్పు కోస్తాలోనే తులాను రేవు వుంది. ఈ తూర్పు కోస్తాకు దిగువగానే దక్షిణంగా ఫ్రెంచివారి ఉత్తరాఫ్రికా రాజ్యాలు వున్నాయి. మొరాకోలో ఫ్రెంచివారి భాగం వుంది. ఆల్జీరియా, ట్యునీసియా ఫ్రెంచివారివే. అక్కడవున్న ఆ ఫ్రెంచి రాజ్యాలలోకి ఎవడైనా ప్రవేశిస్తే అక్కడి ఫ్రెంచి సైన్యాలు ఎదిరించి పోరాడవలసినదని హిట్లరు కోరియున్నాడు. "మా వలస రాజ్యాలను మేము భద్రంగానే కాపాడుకుంటాము" అని పెటేను ప్రభుత్వం జవాబు చెప్పింది. అయినా, ఆ విషయము ఫ్రెంచివారికి హిట్లరు చెప్పవలసిన అవ

సరంలేదు. ఫ్రెంచివారి రాజ్యాలను కాపాడుకోవల సినదని ఫ్రెంచి ప్రభుత్వానికి హిట్లరు చెప్పవలసిన అవసరమేమిటి ? వారిక్షేమం వారికి తెలియదూ ?

కాని, తులాను రేవును ఆక్రమించిన రోజున పెటేనుకు హిట్లరు వ్రాసిన లేఖలో, యీ క్రింది విధంగా వ్రాసియున్నాడు. "నా సర్వశక్తులను ఉపయోగించి ఫ్రాన్సుయొక్క రాజ్యాలను తిరిగి జయించి ఫ్రాన్సుకు వశపరచవలెననే స్థిరసంకల్పంతో నేను ఉన్నాను. ఈ సంకల్పమున కిక తిరుగులేదు" అని వ్రాసినాడు. అయితే, ఫ్రెంచివారికి సింగపూరుదగ్గరగా, సయాముకు సరిహద్దుగావున్నట్టి ఫ్రెంచి ఇండో చైనా రాజ్యంలో జపాను సేనలు ప్రవేశించి, ఫ్రెంచివారి ఇండో చైనాను హస్తగతం చేసుకున్నప్పుడు, హిట్లరు అందుకు ఆమోదించి జపానువాళ్లకు ప్రక్కతాళంవేస్తూ ఊరుకున్నాడెందుచేత ? హిట్లరుకు అప్పుడులేని సంకల్పం ఇప్పుడెట్లా కలిగింది ? ఇది సత్యసంకల్పమేనా ?

### ఫ్రెంచి నౌకాదళం గయా

ట్యునీషియాలో బ్రిటిష్ సేనలున్నూ, అమెరికా సేనలున్నూ ప్రవేశించేటప్పటికి, ట్యునీషియాలోని ఫ్రెంచి సేనలు బ్రిటిష్‌వారి పక్షమేచేరి ట్యూనిస్ రేవులోను, బిజెర్టా రేవులోను వున్న జర్మను సేనలమీద కత్తికట్టి యుద్ధం చెయ్యడం ప్రారంభించాయి. తులాను రేవులోవున్న ఫ్రెంచి యుద్ధనావలనుకూడా వెంటనే బయలుదేరి రావలసినదని, ట్యునీషియాలోని ఫ్రెంచి సైనికాధికారులు ఆహ్వానించారు. తులాను రేవులో అప్పటికి (1) స్ట్రాస్‌బోర్గు అనే 26 టన్నుల పెద్ద యుద్ధనావా, (2) డన్కిర్కు అనే 22 వేల టన్నుల పెద్ద యుద్ధనావా వున్నాయి. ఇవిగాక, (1) కాల్బర్టు, (2) ఆల్జీరీ, (3) ఫాక్, (4) డూప్లే అనే నాలుగు పెద్ద క్రూయిజరు నావలు వున్నాయి. ఒక్కొక్కటి 10 వేల టన్నుల నావ. ఇవిగాక, (1) గాలిసోనీర్సు, (2) జీఁడివిన్నీ, (3) లా మార్షేల్సు అనే చిన్న క్రూయిజరు నావలున్నాయి. ఒక్కొక్కటి 7,600 టన్నుల నావ. కమాండెంటు టెస్టీ అనేటువంటి జలవిమాన వాహక నావ (10 వేల టన్నుల నావ) ఉంది. మొత్తంమీద ఆ రేవులో అప్పుడు 25 డెస్ట్రాయరు నావలున్నూ, 26 జలాంతర్గాములున్నూ ఇంకా అనేక అనుబంధ యుద్ధనావలున్నూ వున్నాయి. ఈ ఫ్రెంచి నౌకాదళాన్ని పట్టుకుంటే బ్రిటిష్‌వారి నౌకాబలంతో సమానంగా తన నౌకాబలం కూడా తులతూగగలదని హిట్లరు భ్రమించాడు. ఇవన్నీ తులానునుంచి పారిపోయి, బ్రిటిష్‌వారి నావల మురాలో చేరిపోతే, మధ్యధరాసముద్రంలో హిట్లరుయొక్క బలం వ్యర్థమైపోతుంది. హిట్లరు ఆట్ట అక్కడ ఇక సాగదు. అక్షరాజ్యాల బలం అంతటితో మిధ్య అవుతుంది. అక్షరాజ్యాలకు మధ్యధరాసముద్రం మిధ్యాధరా సముద్రమవుతుంది. అందుచేత, ఆ ఫ్రెంచి నౌకాదళం తులాను రేవులోనుంచి పారిపోయి బ్రిటిష్వారిపక్షం చేరకుండా, వెంటనే ఆటంకపరచవలసినదని గత శుక్రవారం నవంబరు 27 వ తేదీని జర్మను సేనలను వాఁరక్‌స్టైట్ అనే జర్మను సేనాధిపతి నాయకత్వంక్రింద పంపించాడు. ఫ్రెంచివారికి వ్రాసియిచ్చిన యుద్ధవిరామ పత్రంలోని షరతు ప్రకారంగా అయితే, ఆ రేవులో ఆ కోస్తాలో హిట్లరు అడుగు పెట్టకూడదు. ఫ్రెంచి నౌకదళంమీద చెయ్యి వెయ్యకూడదు. కాని, ప్రమాణ పత్రములున్నూ ఖరారు నామాలున్నూ ఈ నాజీనాయకుడు రోజు కొకటి వ్రాసి, రోజు కొకటి చించివేస్తాడు. తులాను ఆక్రమణ దురాక్రమణ అయినా సరే, చేయవలసినదే అని ఆజ్ఞాపించాడు.

## అందరు శత్రువులే.

అమెరికా ముఖ్యపట్నమగు వాషింగుటను నగరంలో యీ దిగువ కథ ప్రచారంలోవుంది.

ఇరువురు స్విజరులందు దేశీయులగు పత్రికా విలేఖరులు టోకియో (జపాను) నగరంలో అరెస్టయినపుడు తాము తటస్థదేశమునకు చెందినవారమని చెప్పిరి.

"కాదు ; మీరు తటస్థ శత్రువులు" అన్నాడు జపాను పోలీసు ఉద్యోగి.

"అమెరికా-ఇంగ్లాండులను మీరేమంటారు ?" అని ఆ స్విజరులందువారడిగిరి.

"వారు పోట్లాడుతున్న శత్రువులు."

"జర్మనులు ఇటలీవారిని ఏమంటారు?"

"వారు స్నేహంగానున్న శత్రువులు?"

బలే ! జపానుకి అందరూ శత్రువులే.

ఇంత శ్రమపడి జర్మను సేనలను తులాను రేవుమీదకు దూకించేసరికి, వెంటనే అక్కడవున్న పెద్ద యుద్ధనావలలోని ఫ్రెంచి సైనికులు ఆ నావలలో మందు తోటాలను పెట్టి నిప్పు ముట్టించి ధ్వంసంచేసివేశారు. నాజీల కండ్లయెదుటనే నావలు నాశనమైనాయి. మిగిలిన నావలు రేవులోనుంచి తప్పించుకొని పారిపోయినాయి. ఎట్లా మాయమైపోయినవో, ఏమైనవో ఆచూకీ తెలియడంలేదు. తులాను రేవును జర్మనులు పట్టుకున్నారుకాని, నౌకాదళంలేని రేవుమాత్రం చేతికి చిక్కింది. అరివీరులు అరుదెంచిన వేళకు, తులాను రేవు కరిమింగిన వెలగపండులాగున వుంది. తులాను చేజిక్కినదనే ఖులాసా లేకపోయింది. తలమీది కిరీటం రాలిపోతే తల తడివి చూచుకున్నట్లయింది. అతుల పరాక్రమంతో వచ్చిన నాజీ భటసంతతులకు తులానులో చేజిక్కినది నహీ - ఆక్రమించడంవల్ల సంక్రమించినది శూన్యం - దురాశకుపోయి దురాక్రమణ సాగిస్తే, చివరకు మిగిలేది నిరాశ - తులాను సంక్రమణ దినం మహాపర్వదినం అని హిట్లరు ఆశపడితే, ఆఖరుకు అది పర్వదినం కాలేదు - గర్వభంగ దినం అయింది. ఈ సంగ్రామానంతరం అక్షరాజ్యాలవారికి మిగిలేది అక్షయపాత్ర మాత్రమే అని యీ తులాను సంక్రమణ వల్ల తేటతెల్లమవుతూవుంది. ఈ తులానుసంక్రమణం తర్వాత ఉభయపక్షముల బలాబలములు ఎట్లా తులతూగగలవో, ఎవరివైపు బలం తేలిపోతున్నదో ఇకముందు ఇంకా స్పష్టమవుతుంది.

కాని, హిట్లరుకు యింకా విజయలక్ష్మిని చేబట్టగలననే భ్రమ బాగా వుంది. మకర సంక్రాంతి, కుంభ సంక్రాంతి, మీన సంక్రాంతి వెళ్లిపోయి మేష సంక్రాంతి వచ్చి ఎండాకాలం రాగానే సంగ్రామం తిరిగీ బాగా సాగించగలననిన్నీ, విజయలక్ష్మీ పాణిగ్రహణం తనకు జరుగగలదనిన్నీ హిట్లరు యింకా యుద్ధపంచాంగం గుణిస్తూనే వున్నాడు. ఇట్లా మీనమేషాలు లెక్కపెట్టుకుంటూ వుంటే, ఇప్పటికే మూడేళ్లు యుద్ధంచేసి జర్మను సేన మాడి మసి అయిపోతున్నది. రష్యాలో అక్షసేనలు లక్షలకొలదిగా ఆహూతి అయినాయి. నాలుగో సంవత్సరం నడుస్తోంది - నాజీ సేనల నాశనం సంపూర్ణంగా సమీపిస్తోంది - లోకానికి శాంతినిచ్చే సంక్రాంతి సమీపిస్తోంది - ప్రజాస్వామ్యరాజ్యాల కది పర్వ దినం.

## ఫ్రెంచివారి సామ్రాజ్యంలో మహమ్మదీయుల కడగండ్లు

ఇపుడు మిత్రమండలి సేనలు ఆక్రమించిన ఫ్రెంచివారి ఉత్తరాఫ్రికా సామ్రాజ్యంలో ఎక్కువమంది అరబ్బులును, బెర్బరులును అగు మహమ్మదీయులు. 1936 జనాభా లెక్కల ప్రకారం యీ ఫ్రెంచి వలస రాజ్యమునందు సుమారు 150 లక్షల మంది మహమ్మదీయులున్నారు.

| | | |
|---|---|---|
| మొరోకోలో | . | 66,48,888 |
| టూనిసియా | | 23,35,623 |
| అల్జీరియా | ... | 62,01,144 |

నాజీ అధికారం క్రిందనుండి విషీ ప్రభుత్వ పాలనలో వీరు రష్యా యుద్ధరంగమున ఫిరంగుల మేతగా ఉపయోగింపబడేవారు, లేదా జర్మనీ ఆయుధ కర్మాగారాలలో బానిసలవలె నిర్బంధంగా పనిచేసేవారు. ఈ పనులకై గత కొద్ది నెలలలో ఉత్తరాఫ్రికానుండి 17,500 అరబ్బులను ముందు ఫ్రాంసునకు రప్పించి తరువాత జర్మనీకి పంపిరి. మొరోకో రేడియోనుండి జూలై 25 వ తేదిన యిట్లు వినబడింది : "ఫ్రెంచివారి ఆఫ్రికానుండి దేశీయులను నిర్బంధంగా పంపుట యింకను జరుగుచున్నదని విషీవార్తలు తెలుపుచున్నవి. ఫ్రెంచి మొరోకోనుండి అనేక రైళ్లలో దేశీయులు అల్జియర్సు రేవునకు రప్పింపబడిరి. అక్కడ రిక్రూటుమెంటు సెంట్రలు బీరోగలదు. మొత్తంపై జూను నెలలోను, 3,000 దేశీయులు జర్మనీకి పంపబడిరి. . ."

జూలై, ఆగస్టులందు సుమారు 10,000 మంది జర్మనీకి పంపబడిరి. క్రొత్త విషవాయువు తయారు చేయు కార్యమునందు వీరంతా ఉపయోగపడుదురు.

రష్యా యుద్ధరంగంలో పనిచేయుటకే అరబ్బులను విశేషంగా చేర్చుకొనుచున్నారని మొరోకో వార్త తెలిపెను. అల్జీరియానుండి రష్యాకు వాలంటీరు సైనికులు వెళ్లేరని ట్రాంసుఓషను, రేడియో సెప్టంబరు 9 వ తేదీ చెప్పెను.

ఈ ఐచ్ఛిక భటులనబడేవారిని నాజీలు ఎంత మోసగించి క్రూరంగా తీసుకపోతున్నారో చూడండి. వారికి ఫ్రాంసులో లాభకరమగు ఉద్యోగా లిస్తామని చెప్పి మోసగించి తీసుకపోయి, యుద్ధరంగంలో నష్టపోయిన జర్మనుల స్థానే నిలువుచున్నారు.

## ఇండియా సరిహద్దులో మదరాసు బటాలియను.

చిన్న వీడ్కోలు విందు

3 వ మదరాసు రెజిమెంటులోని వైస్రాయి కమిషండు ఉద్యోగుల క్లబులో యిటీవల యిరువురు ఉద్యోగులకు వీడ్కోలు విందు చాల సరదాగా జరిగింది. సుబేదారు మేజరు కె. సి. గోవిందనుగారును, సుబేదారు కె. ఒ. కున్నిరామను నంబియారుగారును బాగా పనిచేసినందుకు ఎమర్జెంసీ కమీషను ఉద్యోగాలిచ్చి బహుకరింపబడిరి.

మదరాసు బెటాలియనుయొక్క పెద్ద ఉద్యోగులందరును, వారి భార్యలును వచ్చిరి. విందు సంతోషదాయకంగా నున్నా, మంచివారిద్దరు బయటకు పోతున్నారే అన్నవిచారం అందరికి యుండెను. వెడలుచున్న యిద్దరికిని. పెద్ద ఉద్యోగులందరికి వారి భార్యలకు పూలమాలలు వేయబడెను. ప్రక్కనున్న కొండలచాటున అస్తమిస్తున్న సూర్యుని ఎర్రని కిరణాలకాంతి విందారగించుచున్న వారందరిపైబడి, ఆ ఉద్యోగుల పని ముగింపునకు చిహ్నముగనుంది.

సుబేదారు నీలాంబరం వారిద్దరి గుణములను కొనియాడుచు మాట్లాడెను. సేనాధికారి వారిద్దరును తనకు యీ క్రొత్త బెటాలియను తయారు చేయు కార్యమునందుకూడ మిగుల తోడ్పడిరని చెప్పి, వారికి భావియభివృద్ధిని కోరి ఆశీర్వదించెను. ఆ ఉద్యోగులిద్దరు గూడ తమను గౌరవించినందుకు కృతజ్ఞత దెల్పుచు ఉపన్యసించేరు.

సుబేదారు మేజరు గోవిందనుగారు 12 వ మలబారు బెటాలియనులో రెండో సీనియరు ఆఫీసరు. 1931 వ సంవత్సరములో యీ బెటాలియనులో చేరెను. గత 7 నెలలనుండి సుబేదారు మేజరుగనున్నాడు. సుబేదారు నంబియారుగారు ఆ బెటాలియనులోనే 1932 వ సంవత్సరములో చేరెను.

రెండు సాహసకార్యాలు.

ఈ మదరాసు బెటాలియను ఇండియా సరిహద్దులందు యుద్ధచర్యలు అతివడిగ నేర్చుకొంటున్నది. వారు ఎటువంటి సాహసకృత్యాలు చేస్తున్నారో శత్రువుని ఏ రీతిగ ఎదుర్కొగలరో వారిలో యిద్దరు చేసిన పనులు చెపితే చాలును. "బి" కంపెనీకి చెందిన సుబ్బయ్య పిళ్లె అను సిపాయి, నవంబరు 2 వ తేదీన, ఒకబండి లాగుచున్న రెండు కంచరిగాడిదెలు బెదరి పరుగు బెట్టుచు దిగుడుగానున్న కొండరోడ్డుపై దౌడు తీయగా, చటుక్కున ఒ కత్తిదూసి అడ్డునిలచి వాటిని నిలపెను. అత నట్లు చేయకున్న కొన్ని ప్రాణాలు కొంత సామాను ఆ రోజున నష్టమయ్యేవి. సుబ్బయ్య పిళ్లె టిన్నవెల్లి జిల్లాలో ఆనాయికులం గ్రామవాసి.

ఈ సైనిక దళం కోహటునుండి వెడలిపోవుటకు ముందు శల్వం అను సిపాయిని ఒక పిచ్చి కుక్క కరచెను. అతని చేతులో కర్రేనా లేకుండెను. అయినప్పటికి ఎలాగో ఆ కుక్కయొక్క వెనక్కాళ్లు రెండు పట్టుకొని, తనతల చుట్టు గిరగిర త్రిప్పుచు కొంతదూరంలోనున్న ఒక గోడకు దాని తలవేసి కొట్టి చంపెను. ఇతర జవానులకు పిచ్చికుక్క కాటుబాధ తప్పిపోయింది. అతను ఆస్పత్రిలో చికిత్స నొందుచున్నాడు. సిపాయి శల్వం దక్షిణ ఆర్కాడు జిల్లాలో వెంగతూరు గ్రామవాసి. 18 సం॥లు క్రైస్తవుడు.

(ఒక విలేఖరి.)

## ఇండియను రెడు క్రాసు - రష్యాకు సహాయం.

కేవలం పారమార్థిక దృష్టితో మానవ సహజమగు ఔదార్యం కలిగి, పక్షపాతం లేకుండా గాయపడినవారికి చికిత్సలు చేసి సహాయంచేయు సంస్థకు "రెడు క్రాసు సంఘం" అంటారు ఈ సంఘం ప్రపంచమంతటావుంది. అన్ని దేశాలలో శాఖాసంస్థలున్నవి. యుద్ధసమయాలందు యీ సంఘానికి పని యెక్కువగ నుంటుంది. ఎర్ర క్రాసు మార్కు యీ సంఘం యొక్క గుర్తు.

ఇండియను రెడు క్రాసు సంఘంవారు రష్యాకు రూ 1,82,000 లు విలువగల శస్త్రచికిత్స పరికరాలు పంపిరి. పోలండునుండి ఇండియాకు వచ్చియున్న పోలండు దేశపు బిడ్డలకు తగిన ధనసహాయం చేసిరి. చీనాలో రెడు క్రాసు సంఘానికి ధనం పంపిరి. సింధు రాష్ట్రంలో వరదల సహాయానికి రూ 2,000 లు పంపిరి అని న్యూఢిల్లీలో జరిగిన ఇండియను రెడు క్రాసు సంఘం కార్యవర్గ సభలో ప్రకటించబడెను.

అమెరికాదేశపు వాషింగుటను నగరంలో వరదలు యిటీవల వచ్చినపుడు యీ సంఘంవారు సానుభూతి సందేశం పంపి సహాయం చేస్తామని తెలిపిరి. అమెరికా సంఘంవారు కృతజ్ఞత తెల్పుచు, వీరి సహాయాభిలాషను ఎంతో మెచ్చుకొని వరదలు తగ్గిపోయినవని చెప్పిరి.

ఇండియను రెడు క్రాసు సంఘంవారు వివిధరాష్ట్రములందు రక్తం జాగ్రత్తచేయు బ్యాంకులను స్థాపించిరి. ఆరోగ్యవంతులవద్ద మంచిరక్తం ప్రోగుచేసి యుద్ధంలో గాయపడిన సిపాయిల చికిత్సకై పంపి వారి ప్రాణాలు కాపాడెదరు.

# మదరాసు సేపరు, మైనరు సైనిక దళం.



మంచి ఆహారం—



—తగు శిక్షణ



—పొంది సమర్థులగు సైనికులుగ తయారగుచున్నారు.

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS.